# మంచు తెరలు

(నాటికలు)



రచయిత

రావులపర్తి భద్రిరాజు




లలితకళా రంగంలోనికి నన్ను తప్పటడుగులు

వేయించిన కులపతి శ్రీ

అడివి బాపిరాజు బావగారికి

భక్తితో

ఈ మంచు తెరలను అర్పిస్తున్నాను..



రావులపర్తి భద్రిరాజు.

# పీఠిక

కథ, కథానిక, నవల మొదలైన వివిధరూపాలతో అభివృద్ధి పొందుతున్న ఈనాటి తెలుగు సారస్వతములో 'నాటిక' కు ఒక ప్రత్యేకతా, స్థానమూ ఏర్పడింది.

„నాటిక" అనే పదానికి ఆలంకారికుల నిర్వచనము వేరు. కాని ప్రస్తుతము రూపకము చిన్నదైతే సరి ఈ పేరుతోనే చెలామణి అవుతున్నది. పేరేదైనా ఏవంవిధరచనలకు అన్యసారస్వతాలతో కల్గిన సంపర్కమే కారణమని చాలామంది పెద్దలంటున్నారు. ప్రయత్నిస్తే దశవిధరూపకాలలో దేనితోనో ఈరచనలను ముడిపెట్టవచ్చు. కాని ఆ ప్రయత్నము అనవసరమూ, దానివల్ల కలిగే ప్రయోజనమూ లేదు. సంస్కృతములో ఊరుభంగమూ, దూతవాక్యమూ, మధ్యమవ్యాయోగమూ మొదలైన భాసమహాకవి రచనలూ, ఇంకా కొందరివి లేకపోలేదు. కాని అవిరూపకాలే కాని „నాటికలు" కావు.

మన తెలుగులో నాటికలు వందలకొలది ఉన్నవి. రేడియో వచ్చిన తర్వాత ఈరచనలకు „గిరాకీ" ఎక్కువయింది. ఏదో ఒక నాటికను రచించని రచయిత లేనేలేడు. అయినా చదువదగ్గవీ, ప్రదర్శించదగ్గవీ చాలా కొద్ది.

జీవితానికి కౌమారము ఎట్టిదో సాహిత్యానికి రూపకరచన అట్టిది. పండిపోయిన లోకజ్ఞత ఉంటేనేకాని ఈరచనలో రచయిత సిద్ధహస్తుడు కాలేడు. రచనకూడా సహృదయామోదము పొందలేదు. ఆ ఆమోదానికి భాజనము కావాలనే ఈ „మంచు తెరలు" బయలుదేరింది. ఈ పుస్తకములో రెండు నాటికలు పొందు పరచబడినవి.

ఇందులో మొదటిది „మంచు తెరలు" ఈనాటికకు సార్థక నామము. బ్రాహ్మణులలో నియోగి, వైదికి మొదలైన శాఖలనేకమున్నవి. ఆ శాఖా

భేదాలవల్ల పరస్పరవైషమ్యమూ, అనైకమత్యమూ కలిగి ఎన్నో అనర్థాలు దాపురిస్తున్నవి. ఏమాత్రము వివేక కిరణాలు సోకినా ఈమంచుతెరలు ఇట్టే విడిపి పోగలవు. ఇవి తొలగితేనే కాని అభ్యుదయము లేదని చెప్పడమే ఈనాటికకు ప్రయోజనము.

ఇందలి రెండవనాటిక „డార్లింగ్" దీనిలో ఒక ధనికుడు ధనగర్వం చేత పచ్చని పల్లెసీమనుండి పట్టణానికి మకాం మారుస్తాడు. అక్కడ పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలోపడి చివరకి ఒక స్త్రీచే మోసగింప బడతాడు, ఇది పాఠకులను తప్పక ఆకర్షించగలదని నానమ్మకము.

ఈనాటికలు రచించిన చిరంజీవి భద్రిరాజు జ్ఞానార్చనకు ఇంకా తాపత్రయపడుతున్న యువకుడు, సత్యమూ, శివమూ, సుందరమూ అయిన కళాప్రపంచములో విహరించవలెననే ఆకాంక్ష కలిగిన మనస్వి. చూచిన వ్వుడు ఇతని విశాలదృక్కులలో, ఎడతెగని చిరునవ్వులో ఈ „ఆకాంక్ష" సహృదయులకు స్పష్టముగా గోచరిస్తుంది. ఇతడు ప్రసిద్ధ చిత్రకారులూ, మహాకవులూ అయిన అడివి బాపిరాజు గారి బావమరది. ఆబాంధవ్యమే ఈయువకుణ్ణి సాహిత్యరంగములోనికి ఆకర్షించింది గేయరచనకూ, నాటకరచనకూ హేతువయింది. అందుచేతనే ఈరచన శ్రీబాపిబావకు అంకితమయింది.

రచన మొట్టమొదటిది. రచయిత యువకుడు. అయినా రసజ్ఞుల శిరఃకంపనకు భాజనమయ్యే అభ్యుదయరేఖలు ఈరచనలో కలవు. వాటిని గ్రహించిన సహృదయులు ఈనాటికలను ఆదరిస్తారని నానమ్మకము. ఆ ఆదరము ఈరచయితకు భావిరచనామార్గమున పాథేయము కాగలదు.

సామర్లకోట
15 ఆగష్టు 1950

వేదుల సత్యనారాయణ శాస్త్రి

# పాత్రలు

---

వల్లభరావు : బి ఏ. సీనియరు చదువుతున్నాడు. సహజంగా ఉన్నత భావాలుకల యువకుడు.

భుజంగరావు : వల్లభరావు ప్రాణమిత్రుడు. బి. యస్. సి. చదువుతున్నాడు.

రంగనాధశాస్త్రి : మంచి ఆస్థిపరుడు. వైదిక మతాభిమాని. నియోగులంటే నిప్పులు కక్కుతాడు. వయస్సు 45 ఏళ్ళు.

శంకరశాస్త్రి : రంగనాధశాస్త్రి ఇంటిపక్కాయన వయస్సు 50 పైన వుంటాయి. ఈయనకు వైదికంపై అట్టే పట్టింపులేదు. వీరింట్లోనే వల్లభరావు అద్దెకుండి చదువుతున్నాడు.

శోభ : రంగనాధశాస్త్రి కూతురు. రూపానికి తగిన గుణం కల యువతి. ఇంటరు చదువుతున్నది.

డాక్టరు : రంగనాధశాస్త్రి కుటుంబవైద్యుడు. ఎల్. ఎం. పి.

సింహాచలం : రంగనాధశాస్త్రి నౌకరు.

# మొదటి రంగము



(స్థలం— వల్లభరావు గది. గదికి మధ్య పువ్వులగుడ్డ పరచిన ఒక డ్రాయరు, మూడుకుర్చీలు వుంటాయి. డ్రాయరుమీద శోభఫొటో మరి కొన్నిపుస్తకాలు వుంటాయి. గదంతా బొమ్మలు పుస్తకాలతో నిండి వుంటుంది మొత్తంమీద. ఉదయం తొమ్మిదవుతుంది. వల్లభరావు డ్రాయరుముందు కుర్చీలోకూర్చుని ఏదోరాస్తూ మధ్యమధ్య సన్నగా పాడుతూ వుంటాడు. శోభఫొటోను ఒక్కసారి ముద్దుపెట్టుకుంటాడు.)

వల్లభ:—(గీతిక) పాడవే ప్రియసఖి

ప్రణయ మాలాపించి

నీవీణ రవములో

నిలచి వెన్నెల కురియ ॥పా॥

(ఫొటోచూస్తూ) ఫొటోలో వున్న ప్రేయసి మాట్లాడు తుందా? హుం పట్టి బొమ్మ!

(శోభ చేత్తో పుస్తకాలు పట్టుకుని ప్రవేశిస్తుంది. మాట్లాడకుండా వల్లభరావు వెనుక నిలబడి ఒకసారి గొంతు సవరించుకొంటుంది)

శోభ:—గుడ్ మార్నింగ్ సార్!

వల్లభ:—ఎవరది? (ఫొటో పుస్తకాలఅడుగున పెట్టేసి) శోభా!

శోభ:—అవును లెండి, ఏదో ప్రణయగీతంలాంటిది రాస్తున్నట్లున్నారే! దగ్గిరుండవచ్చా నేను.

వల్లభ:—ఫరవాలేదు. నీ అడ్డమేముంది అయినా ఇందులో? నిక్షేపంలా:

శోభ:—అయితే ఆప్రియురాలెవరండీ ?

వల్లభ:—ప్రియురాలింకా నిర్ణయం కాలేదండీ !

శోభ:—ప్రియురాలులేందే ప్రణయగీతం ఎలావచ్చిందిమరి?

వల్లభ:—ఏదో హృదయంలోంచివచ్చింది గాల్లోకిపోయింది (నవ్వుతాడు)

శోభ:—అబ్బ...ఏం కవిత్వమండీ !

వల్లభ:—ఏం నచ్చలేదా ?

శోభ:—నచ్చకపోవడంకాదు (మౌనంగా పుస్తకం తిరగేస్తుంది)

వల్లభ:—మరేమిటి ? నసగడం దేనికి ముఖంమీదే అడిగి సందేహం తీర్చుకోరాదూ ?

శోభ:—ఎంతసేపూ ఆడవాళ్ళమీదే రాస్తారేం ప్రణయగీతాలు ? అని నాసందేహం.

వల్లభ:—అంటే ఆప్రణయగీతాలేవో మాస్వజాతిమీదే రాసుకోమనా నీవాదన ? అది ప్రకృతికెంత విరుద్ధమో ఆలోచించు. లోకంలో పురుషునిచే గాఢంగా ప్రేమింపబడేది స్త్రీ. స్త్రీ ఒక కళామూర్తి. అందుకే స్త్రీకి వున్నతస్థానంఇచ్చి పురుషుడు ఆమెను తన హృదయవేదికపై నిలిపి నిరంతరం ఆమెను ఆరాధిస్తాడు.

శోభ:— అవును పాపం. ఇలాటిమాటలువిని స్త్రీ అమాయకం
గా పురుషునితో ప్రేమలోపడి చివరికి బానిసైపోతుంది.
(నవ్వుతుంది)

(గేటుదగ్గర సైకిలు బెల్ మోగుతుంది)

వల్లభ:— ఓహో! (లేస్తూ) భుజంగరావు ఒచ్చినట్టున్నాడు.
వాణ్ణి లోపలికితీసుకొస్తాను ఇప్పుడే. కూచో.

శోభ:— ఊఁ వెళ్ళిరండి త్వరగా. నామాట మర్చిపోయారా?
నాకు సంస్కృత పాఠం చెప్పాలి కాళిదాసు కుమార
సంభవం.

వల్లభ:— ఓ...అలాగే చెబుతాను. ముందు భుజంగాన్ని
లోనికితీసుకురానీ. (వెడతాడు)

(శోభ డ్రాయరుమీది పుస్తకాలన్నీ తిరగేస్తుంది. అందులో
తనఫొటోను చూడగానే ఆశ్చర్యపోతుంది. ఒక్కసారి
ఆనందం ఆమెముఖంలో తాండవిస్తుంది.)

శోభ:— (తనలో) నాఫొటో ఇక్కడికెలావచ్చింది? వల్లభ్
తనఫొటోపక్కనే పెట్టుకున్నాడే నాఫొటోకూడా.
ఆయన నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా! ఎప్పుడూ
చెప్పలేదే! అంతకన్న ఏంకావాలినాకు? ఆయన
ఇదివరకే నామనస్సుదొంగిలించారు. నేనూ ధైర్యం
చిక్కక ఆయనకు చెప్పలేకపోతున్నాను. మాఇద్దరి
మధ్యా ఇంకాఎన్నాళ్ళీ మంచు తెరలు!......

(బూట్లచప్పుడు వినపడగానే ఫోటోమామూలుగా
పుస్తకాలమధ్య పెట్టేస్తుంది)
(వల్లభరావు, భుజంగరావులు ప్రవేసిస్తారు.)

వల్లభ:—కూర్చోరా భుజంగం ఆకుర్చీలాక్కొని.

భుజంగ:—ఓహో శోభా దేవిగారా! నమస్తే.

శోభ:—నమస్తే.

వల్లభ:—శోభా! భుజంగరావు రేపుమనకాలేజీ వార్షికోత్సవానికి అద్భుతమైననాటకం ఒకటి వెయ్యాదలచుకున్నాడు. వీడు నాటకాల్లో అందెవేసినచెయ్యి. ఏ వేషాన్నయినా చాకచక్యంతో ఇట్టే నటించిపారేస్తాడు.

భుజంగ:—ఆహా! మనవాడిలెక్చరు అద్భుతం. అవునులే వల్లభ్ నీకానాటకంతో నిమిత్తంలేనట్లు మాట్లాడుతావేం? అప్పుడే నటన ప్రారంభించావా? శోభాదేవిగారూ! 'సత్యంవదామి' ఆనాటకంలో వల్లభ్ నాయకునిపాత్ర వహిస్తున్నాడు.

శోభ:—నిజంగానా వల్లభ్! చెప్పలేదేం?

వల్లభ:—(నవ్వుతూ) ఏంలేదుశోభా, స్టేజిమీద కనపడి నిన్ను ఒక్కసారి సర్ప్రయిజు చెయ్యాలని చెప్పలేదు.

భుజంగ:—వస్తానువల్లభ్ నాకు వేరేపనుంది. కాలేజీలో కలుసుకుందాం. చెప్పటంమరచాను, మధ్యాహ్నం

ఇంటర్వల్లో మనక్లాసురూములోనే రిహార్సల్ పెట్టు కుందాం. (శోభవైపుతిరిగి) శోభా దేవిగారూ రేపు కాలేజీలోజరగబోయే నాటకానికి తప్పకుండా హాజరుకావాలి. వస్తా గుడ్మార్నింగ్.

శోభ:—ఓ అలాగేవస్తా. (భుజంగరావు నిష్క్రమిస్తాడు)

వల్లభ:—శంకర శాస్త్రిగారొస్తున్నారు శోభా!

శోభ:—రానివ్వండి భయమేమిటి?

(శంకరశాస్త్రి పొడుంపీలుస్తూ ప్రవేసిస్తాడు)

శంకర:—ఏమోయ్ వల్లభరావూ విశేషాలేమిటి?

వల్లభ:—దయచేయండి...ఏమీ లేవు. రేపుమాత్రం కాలేజీలో మంచినాటకం వేస్తున్నాం. దానికిమీరు తప్పక రావాలి.

శంకర:— (కుర్చీలో కూలబడుతూ) నేనా, చాల్లే. ఏంనాటకాలు పోనిస్తూ. ఈరోజుల్లో వేసేనాటకాలే వేరు. పురాణయుగంలోని మాకు మీనాటకాలెక్కడ రుచిస్తాయినాయనా?

వల్లభ:—అలాఅనకండి. అనుదినం కాలంలో మార్పువస్తోంది కాలంతో బాటు మనభావాలుకూడా మార్చుకోవాలి. లేకపోతే ఎలా బతగ్గలంచెప్పండి?

శంకర:—ఊఁ. అంతేలేమరి, నువ్వన్నదీరైటే. అవున్లే పిల్లా నువ్వెప్పుడొచ్చావు? (శోభవైపుతిరిగి)

శోభ:—ఇప్పుడేవచ్చాను శంకరంమామయ్యా. పరీక్షలు దగ్గిరకొస్తున్నాయికదూ. సంస్కృతం, ఇంగ్లీషు చెప్పించుకోడానికి ఒచ్చాను.

శంకర:—అలాగా. చూడూవల్లభరావ్, శోభ చిన్నప్పుడు మామయ్యా అంటూ అస్తమానూ మాఇంట్లోనే తిరిగేది మాపిల్లలతో ఆడుకుంటూ. పాపం చిన్నతనంలోనే తల్లిపోయిందిమొదలు చాలాబెంగెట్టుకుపోయింది వెర్రికూన. మాఆవిడ దానితల్లిలేనిలోటు తీర్చిందని వాళ్ళనాన్న మేమంటే ప్రాణంఇస్తాడు.... అయితే అడగాలనుకున్నానూ, ఇందాకవచ్చిన ఆ ఎఱ్ఱటి కుర్రాడెవరోయ్? చాలా బుద్ధిమంతుడిలాగే వున్నాడుసుమా!

వల్లభ:—అతను నాస్నేహితుడు భుజంగరావు. చాలా మంచివాడులెండి. బి. యస్. సి. చదువుతున్నాడు మాకాలేజీలోనే.

శంకర:—తెలియకడుగుతాను, పెళ్లయిందా బాబూ అతనికి?

వల్లభ:—అప్పుడే సంతానం కూడానండి.

(వల్లభరావూ శోభా పక్కనవవ్వుతారు)

శంకర:—సరిసరి దాచేశాడన్నమాట పెళ్లిపీటమీదనుంచి.

వల్లభ:—ఇంతకీ వాణ్ణిగురించి ఎందుకడిగారో చెప్పలేదు.

శంకర:—ఆఁ, ఏంలేదు మాతమ్ముడుకూతురు ఒకత్తె పెళ్లికి సిద్ధంగావుంది. కాస్త అలాంటి మంచికుర్రవాడు దొరి

కితే మా వాడి క్కబురంపిద్దామనుకున్నాను. అంత కన్నా ఏం లేదు.

వల్లభ:—అయితే మీరు వైదికులు గదా నియోగికుర్రాడికి మీ పిల్ల నివ్వటానికి ఒప్పుకుంటారా?

శంకర:— అదెంత సేపోయ్! కట్టుకునే వాడుంటే మూడునిమి షాల్లో ముడేయించేస్తాను. నాకా పట్టింపు లేదు. నా ఇద్దరాడపిల్లల్నీ నియోగికుటుంబాల్లో కలిపాను. చీకూ చింతా లేకుండా వాళ్లు కాపరాలు చేసుకుంటు న్నారు. ఈరోజుల్లో అగ్నిహోత్రంలాంటి బ్రాహ్మణ జాతంతా నియోగి వైదిక వర్గాలుగా చీలి కయ్యా లికిదిగి కాళ్లు విరగదొక్కుకుంటున్నారు. ఆ కలుపు గోలుతనం లేకే మన బ్రాహ్మణాడికెక్కడికెళ్ళినా ఉద్యోగం లేదు. ఏమంటావ్?

వల్లభ:—మీరన్నది ముమ్మాటికీ నిజం. ఇప్పుడు ప్రత్యక్షంగా జరుగుతూన్న దంతే కట్టండీ!

(సింహాచలం ప్రవేసిస్తాడు)

శంకర:—ఏరా సింహాచలం ఇలావచ్చేవు?

సింహా:—శోభమ్మగారిని అయ్యగారు రమ్మంటున్నారండీ.

శోభ:—ఒస్తున్నారా... (వల్లభరావుకేసి ఓరగాచూసి) వస్తా కాలేజీ టయిమవుతోంది. వస్తాను మామయ్యా!

(శోభ, సింహాచలం నిష్క్రమిస్తారు)

శంకర:—లేవోయ్ భోంచేద్దాం కాళ్ళుకడుక్కో.

వల్లభ:—(శోభ వెళ్ళినవైపుచూస్తూ) అదేమిటి నేనుహోటల్‌కివెళ్ళాలిగా, ఇక్కడెలా భోంచెయ్యనూ?

శంకర:—అలాకాదు నీకుహోటలుతిండి పడదు. ఆసంగతి మీ నాన్నగారికూడా రాశాను. ఇలా మీఅబ్బాయికి హోటలుభోజనం పడ్డంలేదూ, అతన్ని మాయింట్లో భోజనంచెయ్యమని వ్రాయమన్నాను. ఇదిగో ఇవాళే ఒచ్చింది నీకలావుత్తరం మీ నాన్నగారిదగ్గరనుంచి.

(ఉత్తరం వల్లభరావుకి అందిస్తాడు)

వల్లభ:—(ఉత్తరం చూసుకుని) నాతో చెప్పకుండా ఎంతపని చేశారూ!

శంకర:—ఆఁ. ఫరవాలేదు. మీనాన్నగారిని బాగాఎరుగుదును. మాపరిచయం ఈనాటిదా. అబ్బో! చాలా కథవుంది. చెబుతాపద.

వల్లభ:—సరే కానివ్వండి.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు)

(తెరపడుతుంది.)



# రెండవ రంగము



(వాకిట్లో రంగనాధశాస్త్రి సంధ్యావందనం చేస్తుంటాడు. లేడి చర్మంపై కూర్చుని మధ్య మధ్య ఉద్ధరిణి పంచపాత్రకు తగిలి శబ్దం అవుతూవుంటుంది)

రంగ :— ఓం కేశవా యస్వాహా

ఓం నారాయణా యస్వాహా

ఓం మాధవా యస్వాహా (అంటూ మూడుసార్లు ఉద్ధరిణి డేసి నీళ్ళు చప్పుడుచేస్తూ మింగుతాడు. తరవాత రుద్రాక్షమాలలు సవరించి కళ్ళుమూసుకుంటాడు మళ్ళా.)

శ్లో॥ ఓం భూర్భువస్సువః ఓంతత్సవితు ర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్॥

(కళ్ళు తెరిచి) అప్పుడే చీకటిపడింది. ఎవళ్లూ కనపడరు. ఒరేయ్! సింహాచలం (బిగ్గరగా పిలుస్తాడు)

సింహా :—(దూరంనుంచి) ఒస్తున్నానండి. (ప్రవేశించి) ఏం బాబుగారూ?

రంగ :—ఏం అఘోరిస్తున్నావురా అక్కడ ఇందాకణ్ణుంచి?

సింహా :—గేదికి చిట్టుకుతున్నానండి.

రంగ :—అమ్మాయిగారింకా రాలేదేంరా చీకటిపడినా? ఎక్కడికెళ్ళిందంటావు? నువ్వు తొందరగా పోయి రమ్మని తీసుకురా ఎక్కడుందో.

సింహా :—ఇందాక నేను సంతమార్కెట్టు కాడనుంచి ఒస్తూంటే కాలేజి గేటుదగ్గిర కనబడ్డారండి. అక్కడ వల్లభ రావుగారూ ఇంకా శానామందున్నారండి.

రంగ :—ఉన్నాడూ! ఆ నియోగపాడుకూ:డా ఉన్నాడన్న మాట. వాడితో తిరగొద్దని లక్షసార్లు చెప్పాను దానికి. నామాట దాని తలకెక్కటంలేదు. ఇద్దరూ ఒకక్లాసు కాదాయె. సరే ముందు నువ్వెళ్ళితీసుకురా.

సింహా :—ఆయ్ (వెడతాడు)

రంగ:—(తనలో) వాడెక్కడ దాపరించాడు నాప్రాణానికి. ఒక క్లాసు కానప్పుడు ఇద్దరూ ఊరంట తిరగడ మెందుకం టాను? వచ్చేక మళ్లీ వాడిగుమ్మం తొక్కనీయను దాన్ని. ఈడొచ్చిన పిల్లకి చదువు చెప్పించడం నాదే తప్పు. (లేచి ఇటు అటు రెండుసార్లు తిరుగుతాడు) ఎవరది? శంకరం బావగారా! రండి.

(శంకరశాస్త్రి చంకలో విసనకర్ర పెట్టుకుని పొడుం పీలుస్తూ వస్తాడు.)

శంకర :—ఎవరితోనో మాట్లాడుతొన్నట్లున్నారే బావగారు!

రంగ :—ఎవరూ లేరు. శోభ చీకటిపడినా ఇంటికి రాలేదని సింహాచలాన్ని వెళ్ళి తీసుకురమ్మన్నాను. ఇంకా ఎక్కడ పెత్తనాలు చేస్తోందో యీ చదువులు.

శంకర :—వస్తుంది. రాకెక్కడికెడుతుంది. కాలేజీలో ఇవాళేవో నాటకాలున్నాయట. అందుకోసం ఆగింది. అక్కడ.

రంగ :—సరేకాని, మీ యింట్లో వున్న ఆవల్లభరావుగాడితో అది వీధులంట తిరగడం నాకేం నచ్చలేదు. అంతా ఏమనుకుంటారు ?

శంకర :—అతనితో అదెప్పుడూ ఊళ్లో తిరగలేదే! ఎప్పుడేనా అతను ఇంట్లో వున్నప్పుడు మాయింటికొచ్చి అతని చేత పాఠాలేవో చెప్పించుకు వెళ్లేది. పరీక్షలుట గదూ ఏమయినా వల్లభరావు చాలా బుద్ధిమంతుడు సుమండీ.

రంగ :—ఆఁ వాడి బుద్దెవడికి కావాలిప్పుడు ? వాడిబుద్ది వాడి బుఱ్ఱలో నే ఉంటుంది. మనకెందుకు ?

శంకర :—కాస్త పెద్దవాడిని ఎందుకు చెబుతున్నానో వినండి. శోభను వల్లభరావుకిచ్చి పెళ్లి చెయ్యండి. అతన్ని మీయింట్లో నే వుండిపోయేలాగ ఏర్పాటు చేస్తాను. అతనూ వాళ్ళ తలిదండ్రులికి ఒక్కడే సంతానం. పాతికెకరాల కామందు. నేనతని తండ్రిని బాగా ఎరుగుదును. శోభకూడా సుముఖంగానే వుంటుంది. సుఖపడుతుందికూడాను. ఆలోచించండి.

రంగ :—చాల్లెండి, చివరికిదా మీ సలహా. నాకూతుర్ని ఆ నియోగి కుర్రాడికిచ్చిమాత్రం యివ్వను. క్షమించండి బావగారూ! మా కుటుంబంలో ఎన్నడూ జరగలేదు ఇలాంటిది.

శంకర :—ఎందుకొచ్చిన పట్టింపులండీ? మన బ్రాహ్మణీకం యీనాటితో కూడా యిలాగే నాశనం అవుతోంది. మునపటి రోజులాయివి మనవాళ్ళలో కిరస్తానీ వాళ్ళతో లేచిపోయిన వాళ్ళెంతమంది లేరు! ఆ రకంగా బ్రాహ్మణజాతిపతనం అవుతూంటే చూస్తూ ఊరుకుంటే ఎలాగ?

రంగ :—దానికెవడేం చేస్తాడు చెప్పండి?

శంకర :—బ్రాహ్మణస్త్రీ పరాయి జాతివాళ్ళతో.........
తలుచుకుంటే అంతకన్న ఘోరమైంది మరోటుందా? దాన్ని అరికట్టాలంటే మనలో నియోగి, వైదిక భేదాలు లేకుండా సంబంధాలు కలుపుకోవాలి. అప్పుడు బ్రాహ్మణ జాతంతా వేదంలా పవిత్రంగా వుంటుంది. వేదసాక్షిగా చెబుతున్నాను వినండి బావగారూ!

రంగ :—సరే దానికేంలెండి......ఏమైనా నా వంశమర్యాద కాపాడుకోవాలి. ఈ మధ్య విశాఖ జిల్లాలో మా అమ్మాయికి మంచి సంబంధం వున్నట్లు తెలిసింది. మా వంటావిడ కాబోలు చెప్పింది. ఆవిడ వాళ్ళని

ఎరుగునట కూడాను. ఆ కుర్రాడి తండ్రి ఏదో ఎస్టేటులో దివానట. ఆస్తివుంది. పిల్లాడు ఎప్ఫే ప్యాసయ్యాడట. వాళ్లది బాగా పసువైన కుటుంబం. ఆ సంబంధం చెయ్యాలనుంది శోభకి. వాళ్లకి రేపే కబురంపిస్తాను పిల్లను చూసుకోమని.

(శోభ పుస్తకాలుపట్టుకుని ప్రవేశిస్తుంది. కాళ్ళకి జోళ్లు కూడావుంటాయి)

శోభ:—ఎవరికినాన్నా కబురంపించడం?

శంకర:—అదుగో మాటల్లో నేవచ్చింది. నూరేళ్లు.

రంగ:—(కోపంగా) ఎక్కడికెళ్ళావే? చీకటిపడినా ఇల్లు చేరఖల్లా, ఇంతసేపూ కాలెజీలోనే వున్నావా? జోళ్లు తీసెయ్ ముందు.

శోభ:—అవున్నాన్నా కాలేజీలో నాటకం వేశారు. అదయ్యేవరకూ వున్నానక్కడ. అందులో వల్లభరావుకూడా నటించాడు. నాటకం ఎంత బావుందనుకున్నావు. శంకరంమామయ్యా! నువ్వొరమ్మంటే రాలేదుగాని.

రంగ:—చాల్లే, వాడిగొడవెత్తకు నాదగ్గిర. ఈరోజు మొదలు నువ్వు వాడితో మాట్లాడ్డానికి వీల్లేను. పరీక్షలయ్యాక చదువుచాలించు. నాలుగురోజుల్లో నీకు పెళ్ళివారొస్తున్నారు.

శోభ:—నాపెళ్ళికేంతొందర నాన్నా!

రంగ:—పెళ్లీడొచ్చి, పెద్దమనిషివైకూడా పెళ్ళి కేంతొందరని అడుగుతున్నావా? బాగుందే నీవరస. సిగ్గుసిగ్గు నలుగుర్లోనూ తలెత్తుకోలేకుండావున్నాను. నీ కేం?

శోభ:—నాన్నా ఇప్పుడామాట తలపెట్టకు. (చరచర తనగదిలోనికి వెళ్ళిపోతుంది)

రంగ:—(తెల్లబోయి) చూశారా! మొక్కై వంగనిది మానై వంగుతుందా? ఒక్కగాని ఒక్కబిడ్డ కలిగినందుకు అది నాచెప్పినమాట వినటంలేదు. నాఖర్మయిలా కాలింది. ఏమైనాసరే నా కుటుంబగౌరవాన్ని నిలబెట్టుకోవాలి. అంచేత నేననుకొన్నట్లు కుర్రదాని పెళ్ళి జరగాలి.

శంకర:—సరే భోజనంచెయ్యండి. ఘటనెలావుంటే అలాజరుగుతుంది. నేనలావెళ్లొస్తాను.

రంగ:—ఒస్తూండండి. బొత్తిగా రావడంమానేశారు.

శంకర:—అయ్యోరామ కేం వస్తునేవుంటా.

(ఇద్దరూ చెరొకవైపునకూ నిష్క్రమిస్తారు)

(తెర పడుతుంది)



# మూడవ రంగము

—o—

(వల్లభరావు తనగదిలో దివాసిమీద కూర్చుని సితార్ తీగలు సవరి స్తూంటాడు. ప్రక్కనే బల్లస్టాండు, రోట్నం, డ్రాయరు, రెండుకుర్చీలు కూడా వుంటాయి. తానురాసినపాటను సితార్ లోకలిపి పాడుతుంటాడు. సగం పాటయ్యేసరికి శోభ అక్కడికివస్తుంది పుస్తకాలుపట్టుకుని.)

వల్లభ:— (గీతిక)

పాడవే ప్రియసఖీ ప్రణయ మాలాపించి
నీవీణ రవములో నిలచి వెన్నెల కురియ ॥పా॥
నీపాట నిండేది నింగిలో నిజముగా
నీమాట నిండేది నిండు తేనెతోడ ॥పా॥
మాటాడితే చాలు మాణిక్యములు రాలు
నీపెదవి లోనేమి తీపిరేఖలు కలవో ॥పా॥
చిరునవ్వు చిందించి చిత్తమ్ము పులకించి
నను జూసి నారాణి నవ్వుకుంటావేమొ ॥పా॥

(పాట ఆపుచేసి పక్కకితిరిగి) ఓ! శోభా! ఎప్పుడొచ్చావ్ చడీచప్పుడూ లేకుండా?

శోభ:—చాలా సేపయింది. నాటకంలో మీనటన ఎంతోబా గుంది. సాధన్యవాదాలు చెప్పడానికొచ్చాను. నాట కంలో మీప్రియురాలిదగ్గర ఈపాటేకదూ పాడారు?

వల్లభ:—ఏం? బాగుందా? కూర్చో అలాగ.

శోభ:—వల్లభ్! మేడమీదనుంచుని విన్నాను మీపాట. నిజంగా వెయ్యిగొంతుకలతో మీరు నన్ను పిలిచినట్టయింది. పరుగెత్తుకొచ్చాను పాటసగంలోనే.

వల్లభ:— (సితార్ తీగ ఒకసారిమీటి కొంచెంకటువుగా) శోభా! నామీదనీకెందు కంతజాలి?

శోభ:—(తెల్లబోయి) అలా అంటున్నారేం?

వల్లభ:—ఇంకాఎందుకు శోభా! నన్ను ప్రేమిస్తున్నట్టు నటించి బాధిస్తావెందుకు? నీపెళ్లి ఎవరితోనో నిశ్చయమైందిటగా. ...(ఉద్రేకంగా) ఛీ! లోకంలో స్త్రీజాతికి స్థిరంలేదు

శోభ:—లేదు. నేనాపెళ్లికి ఒప్పుకోలేదు. ఒప్పుకోను. నామాటలు నమ్మండి. హృదయపూర్వకంగా మిమ్మల్నే నేనుప్రేమిస్తున్నాను. నామనస్సు ఇదివరకేమీమీద లగ్నమయింది. సంఘానికి భయపడి ఒకరిఉద్దేశాలొకరు తెలుసుకోలేకపోయాం. మీరుతప్ప నాకెవరూలేరు. అంచేత మీకూడా ఎక్కడికైనా వచ్చేస్తాను.

వల్లభ:—అయితే ఇంకానిజంగా ప్రేమిస్తున్నావా? ఎక్కువధనంతో వచ్చేపెళ్లికొడుకునిచూసి నీవుద్దేశంమార్చుకున్నావనుకున్నాను. అల్లాఅనుకుని తీరనివ్యధతో నిరాశచెందాను. మళ్లీఆరిపోయే నా ఆశాజ్యోతికి ఆద్యంపోయడానికి వచ్చావా?

శోభ:—అవును మీరే తిరస్కరిస్తే నాకుమరణంతప్ప గత్యంతరంలేదు. అందుకోసం మనం ఎక్కడికేనాపోదాం (వల్లభరావు చేతులు పట్టుకుంటుంది) పోదాం పదండి.

వల్లభ:—ఎక్కడికిపోతాం శోభా? నీతండ్రికి దూరంకాగలవా? ఎంత తెలివితక్కువపని! వద్దు నామాటవిను. నీతండ్రి వంశమర్యాదను ప్రతిఘటించి నాతోవచ్చి ఎందుకు కష్టాలపాలవుతావు? నన్ను ఒంటరిగాపోనియ్యి. నేను నాతండ్రికూడా దూరమయ్యాను.

శోభ:—ఏమయింది?

వల్లభ:—ఏమీలేదు. ఆయన నాకోపిల్లని చూశాడు పెళ్లి చేద్దామని. దాన్ని నేను నిరాకరించాను. అందుకని ఆయనకు నామీద చాలాకోపం వచ్చింది. నేను ఈ వాతావరణంలో ఇంక వుండలేను. ఒంటరిగా వెళ్లిపోతాను.

శోభ:—నన్ను విడిచి ఎక్కడికివెడతారు?

వల్లభ:—గమ్యస్థానం తెలీదు. కొన్నాళ్ళు అలాప్రయాణం చేయాలి.

శోభ:—ఏమిటీ? మీరింకానన్ను అర్థంచేసుకోలేదా! మన మనసులొకటైనపుడు మన్నెవరేం చెయ్యగలరు?

వల్లభ:—శోభా! తొందరపడకు. ఆలోచించు.

శోభ:—(ఉద్రేకంతో) చాలు, ఇంకా ఆలోచించాలా! మీరింత

పికి పందలనుకోలేను. ఆశలన్నీ మీమీద పెట్టుకున్న ఒక స్త్రీ జీవితాన్ని కాపాడలేరూ? మీరూ నన్ను ప్రేమిస్తూ సంఘానికి భయపడి నన్ను నట్టేటముంచి వెడతారా?

వల్లభ:-(చలించి) అర్థమయింది శోభా! క్షమించు నా ప్రవర్తనకి నీ హృదయ వేదన నీలక్ష్యం ఇప్పుడు తెలుసుకున్నాను. ఇంక మనహృదయాలు ఒకటిగా భావిస్తున్నాను. నిన్ను బొంబాయి తీసుకెడతాను. (శోభను దగ్గిరకి తీసుకుని తలనిమురుతాడు)

శోభ:-అమ్మయ్య. ఇప్పుడు నాహృదయం తేలికయింది... వల్లభ్!

వల్లభ-శోభా! మీనాన్నగారొస్తున్నారు. ఎలాగ?

శోభ:-ఆఁ. భయంలేను. (చటుక్కున దూరంగా నుంచుంటుంది)

(రంగనాధశాస్త్రి నిప్పులుకక్కుతూ ప్రవేసిస్తాడు)

రంగ:-ఏంరా? పశువా. నీవ్యవహారం శృతిమించి రాగాన పడుతోందే! (కోపంగా) నాకూతురికి దురాలోచనలు చెబుతున్నావా? వింటున్నాలే. ఏమే శోభా! నీకంత కన్నా జ్ఞానంలేదూ? ఇంటికినడుముందు, కదలవేం?

(శోభ వల్లభరావువైపుచూసి తలవంచుకుని వెళ్ళిపోతుంది)

వల్లభ:-రంగనాధంగారూ! సంగతి తెలుసుకోకుండా అలా ఇదవుతారేం?

రంగ:—ఏమిటి తెలుసుకునేది? అంతా తెలుస్తునేవుంది. పరీక్షలయిపోయినా ఎందు కాగిసట్టు నువ్విక్కడ? నా కూతుర్ని తీసుకుని ఎక్కడికో పారిపోదామని చూస్తున్నావా? దాని పెళ్లిప్పుడే వేరేనిశ్చయమైంది. ఆట్టే పిచ్చి వేషాలెయ్యకు. జాగర్త.

వల్లభ:—ఆ మెకిష్టమైతే అలాగే చెయ్యాండి. నాఅడ్డమేముంది?

రంగ:—అఘోరించావులే. చేస్తూన్నదంతా ఏమిటి నా కుర్రదాని మనస్సు మారుస్తూను.

వల్లభ:—శాస్త్రిగారూ అనవసరంగా మాటలు జారకండి. మీాను పెద్దలు. యింక మీాతో తర్కం అనవసరం.

రంగ:—ఏంజేస్తావోయ్ మహా? శంకరశాస్తుల్లు రాగానే గది ఖాళీచేయిస్తా చూడు. (కండువా సర్దుకుని గబగబా నడిచి పోతాడు బయటికి.)

వల్లభ:—ఊఁ (పచార్లుచేస్తూ) ఎన్ని మాటలన్నాడు శాస్తుర్లు! శోభని నాకింక దక్కనివ్వడు కాబోలు. నేనిక్కడి నుంచి బొంబాయి వెళ్లిపోవడం మంచిది. సామాను సద్దేసుకుని సాయంత్రం రైలుకే వెడతాను ఎవరికీ తెలియకుండా (సామాను సద్దుతాడు) ఇంతలో (శంకరశాస్త్రి చంకలో గొడుగూ, చేత్తో సంచీ, కర్రా పట్టుకుని ప్రవేశిస్తాడు)

శంకర:—ఏమిటోయ్ వల్లభరావ్ పెట్టీ బేడా కట్టేస్తున్నావెక్కడికి?

వల్లభ :—ఊరికెళ్లొస్తానండీ.

శంకర :—ఇంటికా ?

వల్లభ :—కాదు బొంబాయి వెళ్లొస్తానండి.

శంకర :—అమ్మయ్యో, బొంబాయే! ఎక్కడ బొంబాయి, ఎక్కడ మనం. అయినా ఎందుకిప్పు డంతదూరం, ఇంటికెళ్లవ్వా ?

వల్లభ :—వెళ్లను. బొంబాయి ఉద్యోగ ప్రయత్నంమీద వెడుతున్నా.

శంకర :—అలాగంటావేం ? యింటికెళ్లకపోతే మీ నాన్న గారు నీకోసం యెదురుచూడరూ !

వల్లభ :—ఆశంక లేదు. నాన్నగారికి నాకూ నా పెళ్లివిషయం లో వివాదం వచ్చింది. ఆయన చూసిన సంబంధం నాకు నచ్చకపోవడంవల్ల ఆయన కోపానికి గురి అయ్యాను. అంచేత ఇంటికివెళ్లను కొన్నాళ్లవరకూ.

శంకర :—అదేంపనోయ్ నిక్షేపంలా పెళ్లి చేసుకోక ?

వల్లభ :—మీకు తెలియందేముంది చెప్పండి శాస్త్రుల్గారు. శోభ వుద్దేశం, నావుద్దేశం ఇదివరకే తెలుసుమీకు.

శంకర :—ఆసంగతి యిదివరకే రంగనాథంగారితో చెప్పాను శోభను నీకిచ్చి వివాహం చెయ్యమని. ఏమిటో ఈసారి నా మాట వినిపించుకోవడంలేదు. తలతిక్క మనిషి !

వల్లభ :-(పర్సుతీసి) ఇవిగో మీాయింటద్ది పదహారురూపాయలు తీసుకోండి.

శంకర :--ఆఁ తొందరేమిటి ఇద్దుగాన్లే. ప్రయాణంమీాద వున్నావుకూడాను. అన్నట్టు నెలకింకా నాలుగు రోజులున్నాయిగా.

వల్లభ :--ఫరవాలేదు తీసుకోండి.

శంకర:--సరేలే. ఇలాతే కొంచెం ఇబ్బందిగానే వుందనుకో మరి. (వల్లభరావు చేతిలోని నోట్లు అందుకుంటాడు) వస్తా బాబూ! రైలుబట్టలు విడిచేసి.

వల్లభ:--వెళ్ళిరండి. (శంకరశాస్త్రి నిష్క్రమిస్తాడు)

(భుజంగరావు టెన్నీసుకాకెట్టుతో ప్రవేసిస్తాడు)

భుజంగ:--హల్లో మిష్టర్ వల్లభ్!

వల్లభ:--వెల్ కమ్‌రా భుజంగం.

భుజంగ:--ఏమిట్రా వల్లభా విశేషాలు?

వల్లభ:--టెన్నీసు ఆడివచ్చినట్టున్నారే తమరిప్పుడు. నన్ను పిలవలేదేం?

భుజంగ:--టైంలేక, క్షమించాలి. ఆ హోల్డాలు, పెట్టె సద్దేశావెక్కడికి?

వల్లభ:--మీాయింటికి రావాలనుకుంటున్నాను ఆవిషయం చెప్పడానికి. బొంబాయివెడుతున్నా ఈ సాయంత్రం మెయిల్ కి.

భుజంగ:—ఎందుకోసం?

వల్లభ:—జాబ్ హంటింగ్‌కి. అక్కడ చక్రవాక్ పిక్చర్సులో మన ఫ్రెండు L. S. నాగ్ మేనేజరు వచ్చేయ్యమని రాశాడు. వందరూపాయలకి ఒకపోస్టు ఖాళీగా వుందన్నాడు.

భుజంగ:—అయితే నీ ప్రియురాలు శోభమాట ఏంచేశావు?

వల్లభ:—ఏమోరా భుజంగం, నాకేం పాలుపోవటంలేదు. ఆమె స్వేచ్ఛకి అడ్డొస్తున్నాడామె తండ్రి. ఆమెను పంజరంలో బంధించాడు.

భుజంగ:—అసలు అట్టోముక్కో తేల్చి చెప్పిందా నీకు?

వల్లభ:—ఇందాకవచ్చి తన ఆశలన్నీ నామీదే పెట్టుకున్నానని చెప్పింది. తండ్రిచూసిన సంబంధం చేసుకోనని కూడా స్పష్టంగా చెప్పింది.

భుజంగ:—అయితే ఇంకా ఆలోచిస్తావెందుకు? ఆమెను తీసుకుని గప్‌చిప్‌గా బొంబాయి చెక్కేయ్యాశా!

వల్లభ:—అది అసాధ్యం.

భుజంగ:—ఏం? ఆమెతండ్రి బలవంతంగా ఆ పెళ్ళిచేస్తే?

వల్లభ:—ఆమె నిజంగా నన్ను ప్రేమిస్తే ఆమే తప్పించుకుంటుంది ఆ పెళ్ళినుంచి. అయినా అంత తెలివితక్కువపని మరోటుందా? ఆమె నెక్కడికి తీసుకెళ్ళను. ..భోజనం టైమయింది. హోటలుకి పోదాంనడు. అన్నీ మాట్లాడుకోవచ్చు.

భుజంగ:—నీ మొహంలా వుంది. ఇవాళ హొటల్ లో కాదు నీభోజనం మాయింట్లో. అన్నీ మార్నింగే అరేంజి చేశాను. మాఆవిడ పిండివంటలతో భోజనం తయారు చేస్తోంది. చప్పున్నడు చల్లారిపోతాయి.

వల్లభ :—ఇవాళ ఏమిటా హడావిడి మీయింట్లో ?

భుజంగ :—ఏంలేదు. మాచిట్టిబాబు పుట్టినరోజు ఇవాళ. అదీ సంగతి.

వల్లభ :—నేను బొంబాయి వెళ్ళాక శోభగోడవ ఎప్పటికప్పుడు రాస్తూండాలిసుమా !

భుజంగ :—అలాగే బ్రదర్ తప్పకుండా. త్వరగానడు గదికి తాళంవేసి.

(వల్లభరావు, భుజంగరావూ నిష్క్రమిస్తారు)

(తెర పడుతుంది)



# నాలుగవ రంగము



(రంగనాథశాస్త్రి యింట్లో శోభగది. శోభకి చాలా జబ్బుచేస్తుంది. ఆమె మంచంమీద పడుకొని మూలుగుతూ వుంటుంది. రంగనాథశాస్త్రి శోభకి విసనకర్రతో విసురుతూంటాడు. శంకరశాస్త్రి మంచంప్రక్క కుర్చీలో కూర్చుంటాడు. సింహాచలం కొంచెం దూరంగా దిగులుగా నుంచునివుంటాడు.)

రంగ :— బావగారూ అమ్మాయి వరసచూస్తే నాకు చాలా భయంగావుంది. ఎక్కడనుంచి వచ్చిందో ఈమాయ జ్వరం? మూసినకన్ను తెరవటంలేదు వెర్రితల్లి. పిల్ల చేతిలో ఎలావుందో చూడండి కాస్త.

శంకర :— మరేం ఖంగారుపడకండి. ఫరవాలేదు. అదే తగ్గుతుంది జ్వరం. (శోభ చెయ్యి చూసి) నాడివిషయంలో ఏమీ దోషంలేదుమరి

రంగ :— చెయ్యివేస్తే నుదురుమీద కాలిపోతోందే!

శంకర :— నే చెప్పలా, పైత్యజ్వర లక్షణమే అదని.

శోభ :—(నీరసంగా) అమ్మా

రంగ :— ఇంకెక్కడి అమ్మ పిచ్చితల్లీ! (శోక కంఠంతో) ఏనాడయింది మీఅమ్మ మన్ని విడిచివెళ్లి.

శంకర :— బావగారూ! మీరలా కంగారుపడి దాన్నికూడా కంగారుపెడితే ఎలాగ చెప్పండి?

రంగ :—చూశారా. దానిమాట వింటూంటే గుండెలు ద్రవించి పోతున్నాయి.

శంకర :—ఏం ఫరవాలేదు. అదే తగ్గిపోతుంది.

రంగ :—ఒరేయ్ సింహాచలం! నువ్వెళ్ళి మన డాక్టరుగార్ని తీసుకురారా.

సింహా :—అదేనం డయ్యగారూ నేనూ అనుకుంటున్నాను. దాకటేరుగార్ని తీసుకొస్తే బాగుంటుందని.

రంగ :—వెళ్ళి త్వరగా తీసుకురా. (సింహాచలం వెళతాడు)

శోభ :—(పరాకుగా) అమ్మాఁ ఆయనొచ్చారే!

రంగ :—ఏమిటే తల్లీ? కాస్సేపు కళ్ళు మూసుకోమ్మా.

శోభ :—(మళ్ళీ పరాకుగా) మీరా! ఎక్కడికెళ్ళారు? మళ్ళీ వెళ్ళిపోతారేం! వెళ్ళకండి. వెళ్ళొద్దని చెప్పండినాన్నా. శంకరంమామయ్యా నువ్వైనా ఆపుచెయ్యవ్ ఆయన్ని.

రంగ :—ఏమిటే పిచ్చిదానా ఎవర్నె ఆపుచేయడం?

శోభ :—ఆయనే.... వల్లభ... (కళ్ళుమూసుకుని ఇటుఅటుదొర్లుతుంది)

శంకర :—రంగనాథం బావగారూ! వింటున్నారా అమ్మాయి మాటలు. ఇప్పటికైనా దాని మనస్సులో పీకే కోరికేమిటో తెలుసుకున్నారా? దాని మనస్సంతా వల్లభరావుమీదవుంది. నా మాటలు వినండి ఇప్పటికైనా. శోభని వల్లభరావుకిచ్చి పెళ్ళిచేస్తే సుఖపడుతుంది. వల్లభరావెంత మంచివాడు! అతన్ని మీరు బాగా అర్థంచేసుకోకుండా ద్వేషిస్తున్నారు.

రంగ :-నిజమే. అతన్ని పార్థం చేసుకున్నాను. నానామాటలూ అన్నాను. అతనూ అగ్నిలాంటి బ్రాహ్మణుడే. నిజంగా గుణముంటే మతమెందుకు ?... కాని వల్లభ రావు బొంబాయి వెళ్లిపోయాట్టగా. మళ్ళా నా మొహం చూస్తాడా ?

శంకర :-అదెంత సేపు. మూడు నిమిషాల్లో రప్పిస్తా నతి న్నిక్కడకి.

రంగ :-అయితే అవధాన్లుగారి సంబంధం ఎలా కాదనడం ? అభాసవుతుందేమో. ముహూర్తంకూడా వారం రోజులుంది.

శంకర :-ఏమీ ఫరవాలేదు. ఒక్కటే రామబాణంలాటి మాట రాసెయ్యండి అవధాన్లుగారికి ఉత్తరంలో. ఇలాగ మా అమ్మాయి మీ అబ్బాయిని పెళ్ళి చేసుకోనంటోంది కాబట్టి పెళ్ళి ఆగిపోయిందని ఇందు మూలముగా తెలియజేయుడమైనది. అని రాసేస్తే కిక్కురుమంటే నన్నడగండి.

(సింహాచలం మందులపెట్టి పట్టుకుని డాక్టరుగారితో ప్రవేశిస్తాడు)

సింహా :-డాకటేరుగా రొచ్చారు బాబూ.

రంగ :-ఏరీ, రండి డాక్టరుగారూ మా అమ్మాయి పరిస్థితేం బాగాలేదు చూడండి చప్పున.

డాక్టరు :—— (థర్మామీటరు శోభ నోట్లోపెట్టి) టెంపరేచరు చూస్తున్నాను.

రంగ :—చూడండి ఇవాళకి అప్పుడే ఆరోలంఖణం అమ్మాయి సగమైపోయింది.

డాక్టరు:—భయంలేదు. (థర్మామీటరు చూసి) జ్వరం తీవ్రంగా నేవుంది అయినా కంగారుపడనక్కర్లేదు. ఒక ఇంజక్షను ఇస్తాను తగ్గుతుంది. సాయంత్రానికి చెమటలు పోసి తేలిగ్గావుంటుంది. (ఇంజక్షనుట్యూబ్ మూతికొట్టి సిరింజిలోనికి లిక్విడ్ లాగుతాడు) ఏదీ. చెయ్యిపట్టుకోండి రంగనాథం గారూ ఇంజక్షను ఇస్తాను. (ఇంజక్షనుఇస్తాడు)

శోభ:—అమ్మా.

డాక్టరు:—భయంలేదు కదలకుశోభా. గంటలో జ్వరంతగ్గుతుంది. నేను ఇంక వెళ్ళొస్తానండి రంగనాథశాస్త్రిగారూ మీమనిషిని నాకూడాపంపండి మందిస్తాను.

రంగ:—అలాగే లెండి. కూడా వెళ్ళరా సింహాచలం డాక్టరుగారితో. మందిస్తారు పట్టుకురా.

డాక్టరు:—సరే నేవస్తానండీ. (డాక్టరు, సింహాచలం నిష్క్రమిస్తారు

(ఇంతలో భుజంగరావు చేత్తో పేపరుపట్టుకుని వల్లభరావును వెంటబెట్టుకువస్తాడు)

భుజంగ:—నమస్కారమండీ శాస్త్రుర్లుగారూ.

శంకర:—అడుగో భుజంగరావుకూడా వల్లభరావూవొచ్చాడే? రండిబాబూ కూచోండి. అయితే వల్లభరావూ నువ్వెప్పుడొచ్చావు బొంబాయినుంచి?

వల్లభ:—ఈ వేళ ఉదయం మెయిల్లో వచ్చానండి కొంచెం పనుండి. ఇంతలో భుజంగం చెప్పాడు శోభకి సుస్తీగా వుందని. అంచేత ఓసారి చూసి వెడదామని వచ్చాను.

శంకర:—ప్రొద్దుటే వచ్చావన్నమాట మెయిల్లో. మంచిది నాయనా జ్ఞాపకముంచుకుని చూడ్డానికొచ్చావు అదే పదివేలు.

వల్లభ:—ఆఁ దానికేం లెండి.

భుజంగ:—ఈ వాళ చాలా మంచిరోజండీ శంకరశాస్త్రులుగారూ. పేపర్లో మా అందరి పరీక్షాఫలితాలూ పడ్డాయి.

రంగ:—ఏమయిందబ్బాయీ ప్యాసయ్యారా అంతా?

భుజంగ:—ఏమవడమేమిటండీ శోభా వల్లభరావూ నేనూ కూడా ప్యాసయి పూరుకున్నాం. అందుకని చాలా సంతోషంగా వుంది వాళ.

రంగ:—అలాగా నాయనా! మా శోభకూడా ప్యాసయిందా! కష్టపడి చదివిందిమరి వెర్రిపిల్ల.

శోభ:—(మంచంమీద కూర్చుని) కంగ్రాట్యులేషన్స్ వల్లభ్!

వల్లభ:—లేవకు శోభా! చాలా నీరసంగా వున్నావు. లేస్తా వేం?

శోభ:—ఏదీ అసలు పేపరు చూడనివ్వండి.

వల్లభ:—ఇంకా అనుమానమెందుకు, ప్యాసయ్యావు.

శోభ:—(పేపరు చూసి) మీరు ఫస్టుక్లాసులో ప్యాసయ్యారే! చెప్పేరుకాదు.

భుజంగ:—(లేస్తూ) అలావెళ్లొస్తా వల్లభ్. సైకిలు సూర్యానికి ఇచ్చేసి వస్తాను.

వల్లభ:—ఇదిగో నేనూవస్తా వెడదాం.

భుజంగ:—నువ్విక్కడేవుండు నేనిప్పుడేవస్తాను.

రంగ:—పోనీవెళ్ళనీవోయ్ వల్లభరావ్ నువ్వుమాత్రం ఆగి అతనిప్పుడే వస్తాడులే పనిచూసుకుని.

వల్లభ:—అలాయితే త్వరగారారా భుజంగం (భుజంగరావు వెడతాడు)

రంగ:—చూడూ వల్లభరావూ నిన్నిప్పుడుపూర్తిగా అర్థం చేసుకున్నాను. ఇదివరకేమైనా మాటలనివుంటే క్షమించు.

వల్లభ:—అదేమిటండీ మీరుపెద్దలు నేనుక్షమించడమెందుకు? అయినా మీరు నన్నేమన్నారు?

రంగ:—నువ్వు బొంబాయివెళ్ళాక మాశోభ సగంహరించి పోయింది. నిన్నేవివాహం చేసుకుంటాానని పట్టు పట్టింది. నీకోసం నిద్రాహారాలుమాని పలవరించి మంచంపట్టింది. తల్లిలేని నాకూతురికోరిక తీర్చడం నావిధి. దానిసుఖమే నాసుఖం. అందుకోసంనీవు శోభను తప్పకుండా పెళ్లిచేసుకుని నాయింట్లోనే వుండిపోవాలి. ఇంక అడ్డుచెప్పకునాయనా. నీతల్లిదండ్రులుకూడా ఇక్కడేవుండేలా ఏర్పాటుచేయిస్తాను. నాఆస్తంతా నీపేర వ్రాస్తున్నాను.

వల్లభ:—సరే, ప్రబలమైన శోభ మనోవాంఛను కాదనలేను.

రంగ:—ఆహా! నీవంటి అల్లుడుదొరికినందుకు నిజంగాగర్విస్తు న్నానునాయనా. మనలో నియోగివైదిక భేదాలు పెంచుకోవడంవల్ల ప్రయోజనంలేదని తెలుసుకున్నా ను. ఇదిగో శోభహస్తాన్ని నీచేతుల్లో పెడుతున్నాను

(శోభచేతిని వల్లభరావుచేతిలో పెడతాడు)

శోభ:—(సిగ్గుతో తలవొంచుకుంటుంది)

శంకర:—శుభమస్తుశీఘ్రం అని వచ్చేనెలలో మంచిముహూ ర్తంఒకటుండాలి. ఆముహూర్తానికి విధిగా వివాహం జరగాలి ఉభయులకీ.

రంగ:—ఈలోపుగా వల్లభరావు తల్లిదండ్రులను తీసుకొచ్చే ఏర్పాటుచెయ్యాలి.

శంకర:—ఆవిషయం నాకుఒదిలిపెట్టండి, నేతీసుకొస్తాగా.

రంగ:—సరే అయితే. పంచాంగంచూడండి బావగారూ, ఏముహూర్తంబలమైందోను, పంచాంగం మేడమీద వున్నట్టుంది రండిచూద్దాం. కూర్చోబాబూ వస్తా.

శంకర:—అద్యో అవశ్యం పెందరాడే చూడాలిపదండి.

(రంగనాథశాస్త్రి, శంకరశాస్త్రి నిష్క్రమిస్తారు.)

శోభ:—వల్లభ్!

వల్లభ:—శోభా!

శోభ:—మీరెలా వచ్చేరసలు. నాకు జబ్బుచేసిందని ఎవరు చెప్పారు బొంబాయిలో,

వల్లభ:—భుజంగం నాకు టెలిగ్రాంఇచ్చాడు ఇలానీకుసుస్తీగా వుందని. నాకువెంటనే ఏంతోచక బయలుదేరి వచ్చేశాను నిన్నుచూడాలని.

శోభ:—మీరుచెప్పకుండా వెళ్ళిపోయాక పరితపించిపోయాను ఎలా నన్నువిడిచి వెళ్ళగలిగారుమీరు?

వల్లభ:—నిన్నెలా మరిచిపోగలను శోభా! బొంబాయివెళ్లింది మొదలు మనస్సు నీపై పేపరుగెత్తింది. నీకుజబ్బుగా వుందని తెలిశాక నాశరీరమే పారిపోయి ఒచ్చిందిగా నీదగ్గరికి. (నవ్వుతూ ఆమెబుగ్గలు స్పృశిస్తాడు.)

శోభ:—మీరు రాకపోతే నే నేమయ్యేదాన్నో. మీరు తిరిగి వచ్చి నన్నుకాపాడాలని తులసీదేవికి మొక్కుకున్నాను. మాఅమ్మ నాకు కల్లోకనపడి తులశమ్మకి మొక్కుకోమంది. అలాగేచేశాను. ఇప్పుడు మిమ్మల్ని చూడగానే నాలో వెయ్యిఏనుగుల బలంచేరింది.

వల్లభ:—నాకూ అదేపదివేలు. అవునుగాని అందరూ ఎలా తప్పుకున్నారో చూశావా గమ్మత్తుగా మన్నిద్దరినీ ఇక్కడవిడిచి.

శోభ:—నాకూఅదే ఆశ్చర్యంగావుంది. వల్లభ్! ఇంకమన మధ్య మెదులుతూన్న మంచుతెరలన్నీ కరిగిపోయి కడలికి పరిగెడుతున్నాయి. (వల్లభరావు చొక్కాగుండీలు సర్దుతుంది.)

వల్లభ:—అబ్బో నీకూ కవిత్వం వస్తోందే! నేనూ అదే భావాన్ని నా కంఠంలో పాడుకుంటున్నాను. అన్నట్టు నీవీణ ఎంతవరకూ వచ్చింది? ఏదీ ఎక్కడుందసలు?

శోభ:—అదుగో పక్కగదిలో నేవుంది తెస్తాను. (లేవబోతుంది)

వల్లభ:—నే తెస్తాను నీవు లేవకు. (శోభను భుజాలుపట్టుకుని కూర్చోపెట్టి తాను వెళ్ళి వీణపట్టుకొస్తాడు.)

శోభ:—మీరుకూడా వాయిస్తారుగా వీణ.

వల్లభ:—ఓమాదిరిగా.

శోభ:—అయితే ఇప్పుడు మీకంఠంలో కదిలేపాటను కొంచెం వాల్యూము హెచ్చించి వీణతో కలిపిపాడండి.

వల్లభ:—ఓ అలాగే. (గొంతుక సవరించుకుని వీణ శృతిచేస్తాడు)

గీతిక.

మంచు తెరలన్నియూ మాయమైనవే చెలీ
మంతనమ్మల మరి మాటేలనే చెలీ ||మం||
మలయ పవనము వీచె మరల మరల మనపై
బరువుగా హృదయాన భావాలు నిండెనే ||మం||
జాజి పూ వాసనలు జడలోన మెదిలితే
జగమునే మరతునే జవరాల అదియేమొ ||మం||

శోభ:—ఈపాట చాలాబాగుంది.

వల్లభ :-శోభా చెప్పటం మరిచాను. నేనొకసారి బొంబాయి వెళ్లి రావాలి.

శోభ :-(కంగారుగా) మళ్ళా ఎందుకు బొంబాయి ? ఒద్దు. వెడితే మళ్ళా రారు.

వల్లభ :-మళ్లీ తప్పకుండా తిరిగొస్తాను. అక్కడ నేను చేస్తూన్న ఉద్యోగానికి స్వస్తిచెప్పి.

శోభ :-ఏదీ నమ్మకం ఎక్కడ ? వెడితే అక్కడ మీరు ఎవరివల్లో పడతారో అని నా భయం. అంతకన్నా ఏంలేదు.

వల్లభ :-ఇదిగో చేతిలో చేయి వేస్తున్నాను. (శోభచేతిలో చేయివేస్తాడు) అలాంటిది కల్లోకూడా అనుకోకు. అక్కడ సామాన్లు ఉన్నాయి, వెళ్ళి అవి పట్టుకొస్తాను.

శోభ :-అయితే ముహూర్తం ఎప్పుడో తెలుసుకుని మరీ వెళ్లండి. వెంటనే తిరిగిరాకపోతే నేనేమైపోతానో ఆలోచించుకోండి.

వల్లభ :-పనిఅయిన వెంటనే రెక్కలుకట్టుకు వాలనూ నీ దగ్గర. అంతగా భయపడతా వెందుకు ?

శోభ :-నాకేం భయం నేనొక భావ కవిగారిని పెళ్ళాడ బోతున్నాను.

వల్లభ :-అయితే నాకు భావకవి బిరుదాన్నిచ్చావన్నమాట బోర్డు కట్టుకోవచ్చా ? (నవ్వుతాడు)

శోభ :—కాని ఆ బోర్డుచూసి ఎవళ్లూరారు ఆజబ్బు వున్న వాళ్లు ఏకొద్దిమందోతప్ప......ఇదిగో నేను ఇవాళ తులసిపూజ చేసుకోవాలి. పెరట్లోకి వెడదాంపదండి. (లేచి రెండడుగులు వేస్తుంది తూలుతూ.)

వల్లభ :—శోభా నీఅంతట నువ్వు నడవలేవు. నేనునడిపిస్తాను. (శోభ భుజాలు పట్టుకుని నడిపిస్తాడు వల్లభరావు.)

శోభ :—ఎలాగా మనభవిష్యత్తులోకి మీారేగా నన్నునడిపించడము (వల్లభరావుభుజం ఆధారంగా తీసుకుని నడుస్తుందిశోభ)

వల్లభ :—పద వెడదాం. (చేతో ఆమె నడుముచుట్టి నడిపిస్తాడు) (వల్లభరావు శోభా తెరలోనికి నడిచి వెళ్ళిపోతారు.)

(తెర పడుతుంది)



# పాత్రలు

---

రఘునాధరావు : ఒక ధనికుడు. వయస్సు సుమారు 40 ఏళ్లు

వరహాలు : రఘునాధరావు నౌకరు.

కాశీనాధ్ : సుశీల స్నేహితుడు.

సుశీల : నైతిక పతనంచెందిన ఒక స్త్రీ.

# మొదటి రంగము



(ప్రదేశం—రఘునాధరావు ఇంటిముందు వరండా. తెర లేవగానే ఒక పడకకుర్చీ రెండు కర్రకుర్చీలు కనిపిస్తాయి. ఆ ఇంటినౌఖరు వరహాలు తలకుతువ్వాలు పాగాచుట్టి కుర్చీకి జార్లపడి కునుకుతీస్తూంటాడు. ఆసమయంలో రఘునాధరావు ప్రవేసిస్తాడు. తెల్లటి గ్లాస్కో-పంచకట్టి. గోధుమరంగు సిలుకులాల్చీ వేసుకుని ఠీవిగా నిగనిగలాడే నల్లనిచేతికర్ర తిప్పుతూ వస్తాడు)

రఘు:—వరహాలూ! ఓ వరహాలూ!

వర:—(ఉలిక్కిపడి లేచి) అయ్యబాబోయ్ ఇక్కడే వున్నానండోయ్!

రఘు:—హోరి నీదుంపతెగా ఆనిద్దరేమిట్రా? నువ్వు పగలు డ్యూటీలోవుండగా నిద్దరోడానికి వీల్లేదని ఎన్నిసార్లు చెప్పాను?

వర:—(చేతులు నలుపుతూ) చాలాసార్లు చెప్పేరండి.

రఘు:—(పడకకుర్చీలో కూర్చుని) అలాకాదు. నిద్దరోవద్దురా అని అధమపక్షం రోజుకెన్నిసార్లు మొత్తుకునేవాడిని?

వర:—(అనుమానిస్తూ) రోజుకి డజనుసార్లు......

రఘు:—సరే ఆగవోయ్ చవటయ్యా. నువ్వు నిద్దరోతూండగాచూసి ఏగూండాయేనా ఇంట్లోపడి కుర్చీలూ అవీ ఎత్తుకుపోతేనో! దాంతోసరా నిన్నుకూడా వాడితోకట్టి తీసుకుపోతాడు. అప్పుడు నాకు పోలీసు

వాళ్ళను పిలిచిపెట్టడానికూ్కడా ఎవడూ వుండడు. అంచేత నిద్దరోకురా నీమొహంతుడ్చా. తెలిసిందా?

వర:—అది నిద్ర కాదండయ్యా.

రఘు:—మ రేమిటది?

వర:—నాది ఏనుగు నిద్దరండి. మీారెప్పుడూ సరిగ్గా చూళ్లేదు గాని ఓకన్ను తెరిచే వ్వంటుందండి. (పౌరుషంగా) అయ్య గారెంత మాట నేశారొక్కసారి. ఎప్పుడన్నా గడ్డి పరక పోయిందంటండి ఇంట్లోను. అలా జరగడానికి వల్లా.

రఘు:—శభాష్‌రా వరహాలూ! నీసంగతి నాకు తెలీదు్రటా. అప్పుడప్పుడు నిన్నిలా పరీక్షిస్తుంటానని కూడా చెప్ప లేదు్రటా వెర్రిమొహమా?

వర:—చిత్తం చిత్తం చెప్పారండి.

రఘు:—అయితే వరహాలూ మనఊరిచివర తోటల్లోకి ఎవరో పతివ్రత దిగుమతీ అయిందట నిజమేనా?

వర:—ఆళ్ల కేంలోటు బాబూ రోజూదిగుతూనే వుంటారు. ఆతోట యజమాని ఈఊళ్లో వున్నన్నాళ్లూ పతివ్ర తలకేం లోటులేదండి. మళ్లా అయ్యగారికి బెమకలిగి నట్టుంది.

రఘు:—అదిగాదురా నీయమ్మక్కడుబ్బంగారంగానూ. ఊరికే తోచక అడిగానంతే ఊళ్లోసంగతి.

వర :—అయినా తమరింకా పైగా పైగా తిరగటం నాకేం నచ్చలేదు బాబయ్యా.

రఘు :—ఏం చెయ్యమంటావురా రాత్రుళ్ళు నిద్దర పట్టక ఛస్తూంటేను. వెర్రి వెంగళప్పా మెట్ట వేదాంతం చెబుతావేమిట్రా మెట్ట వేదాంతం.

వర :—ఏమిటోనండి. అమ్మగారు పోయాక మీలో చాలా మార్పు వచ్చేసింది.

రఘు :—పాతగోడవ పైకితేకురా ఏడుపొస్తుంది.

వర :—అంచేత మీరు మళ్ళీ పెళ్ళిచేసుకుంటే.....

రఘు :—చాలు చాలు కట్టిపెట్టు నీ అధిక ప్రసంగం.

వర :—అయితే నాదొక్క మనవి.

రఘు :—అదేమిటో చెప్పెయ్యి దాచక (సిగరెట్టు నోట్లో పెట్టుకుంటాడు.)

వర :—(అగ్గిపుల్ల వెలిగించి ఆ సిగరెట్టుకి ముట్టిస్తూ) తమరు మళ్ళీ ఏ బిద్యే చదువుకున్న అమ్మాయిగారినో పెళ్లి చేసుకుని, పట్నంలో మకాంపెట్టి, కారులో బీచి కెడుతూంటే చూడాలని సరదాపుట్టింది బాబయ్యా.

రఘు :—హారిపిడుగా ఎంత ఎత్తువేశావ్! నాకు నలభై ఏళ్లు పూర్తి కావస్తున్నాయి పిల్ల నెవడిస్తాడురా పెయ్యమ్మా ఎంత డబ్బుంటేమాత్రం.

వర :—మీరు తలుచుకుంటే కొండమీది కోతి దిగొస్తుంది.

రఘు :—ఒరేయ్ చదువుకున్న పెళ్లాం అయితే చెవులట్టుకుని ఆడిస్తుందిరా. నీకేం తెలుసు నీ మొహం. నేను పత్రికల్లోనూ వాటిల్లోనూ చూస్తూనే వుంటాను అలాటి గొడవలు. అయినా నాకేం భయంలేదులే, చదువుకున్న ఆడవాళ్లని లక్షమందిని చూశానుకనక.

వర :—మీరుకూడా ఏ బియ్యేవో పాసు అవవలసిందండి.

రఘు :—అవుదామనుకున్నాను. కాని నాకు మొదట్నుంచీ ఆట పాటలమీద వుండే అభిమానం చదువుని చంపేసిందిరా వరహాలూ. ఇప్పుడెందుకు చదువుకోలేదాని అదే పనిగా అనుకుంటున్నాను.

వర :—పోనీలెండి అయిందేదో అయిపోయింది. మీరు ఇంగిలీషు నేర్చుకోండి నాక్కూడా ఎప్పుడేనా రెండు ముక్కలు చెబుదురుగాని.

రఘు :—వెధవ ఇంగిషులే. అదంటే నాకు తలనొప్పి. అది తెల్ల దొరపీనుగుల ఎంగిలి పీచేగదుట్రా !

వర :—అంతేగాబోలండి బాబయ్యా.

రఘు :—ఏడిసినట్టేవుంది ఇంకా కాబోలండి అంటావేం ? మనవాళ్లంతా కట్టగట్టుకుని ఏకగ్రీవంగా ఆ విషయంలో ఒప్పుకున్నారు తెలుసా.

వర:—అయ్. అవునంటండి,

రఘు:—ఒ రేయ్ వరహాలూ చెబుతున్నానువిను. నేను పట్ట ణంలో మకాం పెట్టదలుచుకున్నాను.

వర:—(సంతోషంతో) మరి నన్నుకూడా తీసుకెళతారా అయ్యగారూ.

రఘు:—ఓయస్ గా తీసుకెళతానురా. నువ్వు రాకపోతే ఎలాగరా నీతస్సాగొయ్యా.

వర:—చిత్తం అయితే బెంగలేదండి. అయ్యగారి పేరుచెప్పుకుని పట్నంకూడా చూసేత్తాను. అయితే తెలియకడుగుతాను ఎప్పుడుబాబూ పయాణం?

రఘు:—వచ్చేవారంలోనే ప్రయాణం. పొలాల శిస్తులన్నీ వసూలవ్వాలి నాలుగురోజుల్లో, (కుర్చీలోంచి లేచి) నేను బ్యాంకికి వెళ్ళివస్తాను. మనరైతులందరినీ నువ్వు నాదగ్గిర సాయంత్రం లోపుగా హాజరుపెట్టాలి.

వర:—చిత్తం నేనుకూడా మాఆడాళ్ళతోటి చెప్పొస్తానండి మన ప్రయాణంమాట.

రఘు:—ముందు రైతుల్ని తీసుకురావెళ్ళి. (నిష్క్రమిస్తాడు)

వర:—చిత్తంచిత్తం. (మరోవైపునుండి నిష్క్రమిస్తాడు.)

(తెరపడుతుంది)



# రెండవ రంగము



(రఘునాథరావు పట్టణంలో అద్దెకుతీసుకున్న మేడలో ఒకగది. ఆగదికి మధ్యగా సోఫా దానికి రెండుప్రక్కలా రెండు మడతకుర్చీలు వుంటాయి. సోఫాలో సగంపడుకుని రఘునాథరావు పేపరు చూస్తూంటాడు. వరహాలు ఎలక్ట్రిక్ ఫాను తెచ్చి ఒకస్టూలుమీద అమర్చుతూంటాడు.)

వర:—బాబూ ఈయూల పేపర్లో ఏంరాసేడండి?

రఘు:—(పేపరు మడిచి) ఏంరాయడమేమిటి. ప్రపంచకంలో వుండేసంగతులన్నీ వుంటాయి పేపర్లో.

వర:—చిత్తం అయితే ప్రపంచకం ఎలావుంటుందండి?

రఘు:—ప్రపంచకం గుండ్రంగా సీతలకాయలాగే వుంటుంది. ఏమిటా చొప్పగంటిప్రశ్న.

వర:—(నవ్వుతూ) చిత్తం. మనం ఈపట్టణం వచ్చాక మన ఇంటిమాటే మర్చిపోయామండి.

రఘు:—ఇంటిదగ్గిరేముందిరా నీముఖం. ఇక్కడ స్వర్గంలా లేదుట్రా వరహాలూ!

వర:—వైకుంఠం కంటే వెయ్యిరెట్లు బాగుందండి. కాని...

రఘు:—ఏమిటో చెప్పెయ్యి దాచక.

వర:—ఏంలేదు బాబయ్యా! ఇంటికాడ ఆడంగులు ఏం అవస్త పడుతున్నారో అని......

రఘు :--అయితే ఈ పాతికా పంపించు. (పాతిక రూపాయ లిస్తాడు వరహాలికి)

వర :--(నోట్లు అందుకుని కళ్ళకద్దుకుని) బతికించారు.

రఘు :--ఒరేయ్ వరహాలూ మనం యిక్కడికి వచ్చినట్టు పేపరులో కూడా వేయించాను.

వర :--అయ్యో- ఎప్పుడండి ?

రఘు :--అంతేకాదు మంచి అందమైన, చదువుకున్న వధువు కూడా కావాలని ప్రకటన వేయించానురా.

వర :--మంచిపని చేశారండి.

రఘు :--(ప్రక్కకు చూసి) ఒరేయ్ వరహాలూ గేటుదగ్గర చప్పుడవుతోంది ఎవరో వచ్చినట్టున్నారు చూసిరా.

వర :--(లేచి వెళ్ళబోతాడు)

రఘు :--ఒరేయ్ ఎవరొచ్చారో సరిగ్గా చూడు. ఆడాళ్లైతే అభ్యంతరంలేదు రానీ. ఇదుగో మొగాళ్లైతేమాత్రం ఎందుకో గట్టిగా కనుక్కుని మరీ తీసుకురా. దొంగ లేమో జాగర్త.

వర :--అలాగేనండి.

రఘు :--అలాగేఅంటే దొంగవెధవల్ని తీసుకొస్తావేమిటి ?

వర :--తు చ లు తప్పకుండా మీరు చెప్పినట్టే చేస్తానండి.

రఘు :--అయితే వెళ్లిరా. (వరహాలు వెడతాడు).

వర :--(తిరిగివచ్చి) అయ్యగారూ ! ఎవరో సూటూ, బూటూ వేసుకుని వచ్చాడు మీకోసం.

రఘు :—అలాటి నూటురాయుళ్ళని అసలు గేటుదగ్గిరక్కూడా రానీవద్దని చెప్పలేదుట్రా.

వర :—వాడు నామాట వినిపించుకుంటేనాండి బాబూ గేటు తలుపులు తీసుకుని లోపలికి రాబోతున్నాడు. మీకు జోతిస్కం చెబుతాట్టండి.

రఘు —ఏడవలేకపోయాడు. పొమ్మను అవతలకి.

వర :—అలాగే చెప్పానండి.

రఘు :—వాడే పోతాడులే కాఫీ తీసుకురా వెళ్లి. (పేపరు విప్పును)

వర :—చిత్తం. (వెడతాడు)

(బూటు చప్పుడు చేసుకుంటూ ఒక కొత్తవ్యక్తి నూటులోవచ్చి రఘునాధరావు ప్రక్కనే కుర్చీ లాక్కొని కూచుంటాడు.)

రఘు :—(ఉలిక్కిపడి) ఏయ్ ఎవరునువ్వు ? ఊరు పేరు మంచి చెడ్డా ఏమిటీ మొండిధైర్యం ఎవరినడిగి నువ్వు లోపలికొచ్చినట్టు.

కొత్త:- మీనౌకరు గేటుతీస్తే లోనికివచ్చానంతేనండి.

రఘు:—హారి పీడిదుంపతెగా మావరహాలుగాడే గేటుతీసి ఒచ్చాడా. అయినా మావాడు బుద్ధిలేక గడ్డితిని గేటుబార్లా తీసివస్తే నువ్వు ఘరాణాగా లోపల దూరడమేమిటి? గేటువేసేసి నీదారిని నువ్వుపోక.

కొత్త:— క్షమించాలి సార్. నేను పనికాకుండా తిరిగి పోయేవాడిని కాను. నేను పామిస్ట్రీ, ఫేషియాలజీలు

క్షుణ్ణంగా చదివాను లక్షోటా ప్రశ్నలకు సమాధానం సూటిగా లభిస్తుంది నాదగ్గిరనుంచి. మీరు జమీం దార్లని మీముఖమే చెబుతోంది స్పష్టంగా.

రఘు:—ఏయ్ ఏమిటానక్కకూతలు ఏమీఅద్దు వెళ్ళు వెళ్ళు.

కొత్త:—ఏమండోయ్ పొరపాటు పడుతున్నారు. మీచెయ్యి చూసి నేను డబ్బు అడుగుతా ననుకున్నారా? అది నాజీవితంలో లేదు. ప్రజాసేవే నాపరమాశయం.

రఘు:—అయితే అబ్బాయీ నీ పేరు?

కొత్త:—కాశీనాథ్.

రఘు:—బాగుంది. ఏదీ నాచెయ్యిచూసి ఏంచెబుతావో చెప్పు (చెయ్యిచూపించును.)

కాశీ:—(చెయ్యిచూసి) మీదిగొప్ప అదృష్టజాతకం మీరు వెనక మీభార్యను మీచేతులమీదుగా స్వర్గానికి పంపించారుగదూ.

రఘు:—(ఆశ్చర్యంతో) ఆఁ. నిజమేనయ్యా తరవాత తరవాత.

కాశీ:—ఆవిషయంలో మీరేం అధైర్య పడనక్కర్లేదు. మళ్లీ మీకుకళ్యాణ యోగంవుంది. చదువుకున్న పిల్లనే పెళ్ళాడబోతున్నారు.

రఘు:—ఎన్నాళ్లకో చెప్పాలి.

కాశీ:—(ఆలోచించి నవ్వుతూ) ఆఁ. ఈ నెలలోనే మీపెళ్లి జరిగి తీరాలి జాతకాన్నిబట్టి. మీరు తరిచి అడగబట్టే ఆ

విషయంకూడా ఇప్పుడే చెప్పగలిగాను.

(వరహాలు కాఫీతెచ్చి బల్లమీద పెడతాడు)

రఘు:—కాఫీ పుచ్చుకోవోయ్.

కాశీ:—వద్దులెండి పుచ్చుకునే వచ్చాను.

రఘు:—(కాఫీ తాగుతూ) సరే. అసలు మీ దేవూరు?

కాశీ:—మాది గోదావరి జిల్లాఅండి.

రఘు:—అలాగటోయ్ మాదీగోదావరి జిల్లాయే. బావుంది, బావుంది.

కాశీ:—(లేచి) సరే వెళ్లొస్తానండి చాలాపనుంది.

రఘు:—మంచిదమ్మా వెళ్లిరా. అప్పుడప్పుడు వస్తూండు.

కాశీ:—అలాగేలెండి శలవు. (వెడతాడు.)

(వెనకాలే రఘునాథరావు వరహాలూ కూడా నిష్క్రమిస్తారు.)

(తెర పడుతుంది.)

# మూడవ రంగము

(మర్నాడు ఉదయం రఘునాథరావు సోఫాలో కూర్చుని కాఫీ త్రాగుతూవుంటాడు. వరహాలు ప్రవేశించి ఒకచేత్తో అరటిపండ్ల అత్తం, రెండోచేత్తో రెండు బత్తాయిపళ్లు బజారునుంచి కొని తెచ్చినవి బల్లమీద పెడతాడు)

వర :—అయ్యగారూ! మీకోసం ఎవరో వచ్చారండి. గేటు దగ్గిర నిలబడ్డారు.

రఘు :—మళ్ళా ఎవడొచ్చాడురా?

వర :—మొగోడు కాదండి. సన్నగా పొడుగ్గా అచ్చంగా సీతాకోక చిలకేనండి.

రఘు :—ఎవర్రా?

వర :—ఎవరో ఆడావిడేనండి.

రఘు :—(వికసిత వదనంతో) ఆఁ నిజమే. ఆడవాళ్లని అనవసరంగా గేటుదగ్గిర నిలబెట్టవద్దని చెప్పలా వెళ్ళి చప్పున గేటు బార్లాతీసి లోపలికి ఆహ్వానించు.

వర :—అలాగేనండి (వెడతాడు)

రఘు :—(తనలో) వచ్చిన ఆవిడ ఎవరైవుంటుందో అయినా ఆడవాళ్లు ఇళ్లల్లో చొరబడడం వింతగానే వుంది ఈ ఊళ్లో.

(సుమారు 23 ఏళ్ళ ఒక యువతి విలువైన దుస్తుల్లో ప్రవేశిస్తుంది.)

యువతి :—నమస్తే రఘునాధరావుగారూ !

రఘు :—(కాఫీగ్లాసు బల్లమీద పెట్టి) ఎవరుమీరు ?

యువతి :—నేనా ఒక జర్నలిస్టుని లెండి.

రఘు :—అలాగా అయితే సెలబడ్డారు అలా కూర్చోండి. (కుర్చీ చూపించి...మీ పేరు ?

యువతి :—నా పేరు సుశీల. (కుర్చీలో కూర్చుండును)

రఘు :—పేరుమాత్రం చాలా బాగుందే. అయితే నా పేరు మీకెలా తెలిసింది ?

సుశీల :—పత్రికలో మీ పేరు చూసి సరిగ్గా అందులో మీ రిచ్చిన విలాసానికే వచ్చాను. 'అయామ్ వెరీ గ్లాడ్ టు సి యు'

రఘు :—ఏం చదివావు అమ్మాయీ.

సుశీల :—బియ్యే చదువుదామనుకుని మళ్లీ మానేశానండి.

రఘు :—పోనీలే అంతకన్నా పెద్ద చదువెందుకు ఇల్లూ, ఒళ్లూ గుల్లయిపోడానికిగాని. చూడూ మీతల్లీ తండ్రీ బాగావున్నారా ?

సుశీల:-(విచారంగా ముఖంపెట్టి) వాళ్లువుంటే బాగా నేవుండును నాకీకష్టాలే లేకపోను. నాకెవ్వరూలేరు నాకు నేనుతప్ప.

రఘు:—అయ్యయ్యో పాపం. మరి నువ్వెలా కాలంగడుపుతున్నావు.

సుశీల:—కొన్నాళ్లు టైపిస్టు ఉద్యోగం చేసి మానేశాను. ఇప్పుడు కథలూ, పుస్తకాలూ రాసి సంపాదిస్తున్నాను. ఆడబ్బు నాకు సరిపోత్తోందిలెండి. ఇంతకీ నేను మిమ్మల్ని కోరేదొకవిషయం.

రఘు:—(ఆదుర్దాగా) ఏమిటది?

సుశీల:—మీరు పెళ్లిచేసుకోదలుచుకున్నారు. నాకూ ఇంత వరకూ పెళ్లికాలేదు.

రఘు:—(గాభరాగా) కారణం?

సుశీల:—నేను ఇష్టపడకే. మాఅమ్మ నీపెళ్లి చూసేయోగం లేదే అంటూ ప్రాణం విడిచింది. కూడానూ. ఇంక నేను పెళ్లిచేసుకుంటేగాని మాఅమ్మకి ఆత్మశాంతి కలగదు. అందుచేత నేను మిమ్మల్ని పెళ్లి చేసుకోడానికెట్టి అభ్యంతరమూ లేదు. మీరేమంటారు?

రఘు:—(గుటకలు మింగుతూ) నీపరిస్థితి చూస్తే చాలా జాలివేస్తోంది నాకు. నీలాటి అనాధను కాపాడటం నావిధి. సుశీలా! నిన్ను నేను తప్పకుండా పెళ్లి చేసుకుంటాను. ఇంకనీవు నాయింట్లోనే వుండిపోవచ్చును.

సుశీల:—(ఆనందంతో) మీరెంత దయగలవారూ! నేటినుంచి నేను మీ డార్లింగ్‌ని.

రఘు:—సుశీలా ఇలా సోఫాలోకూర్చో విశాలంగా రా.

సుశీల:—(సిగ్గు అభినయిస్తూ లేచి రఘునాధరావు పక్కనే సోఫాలో కూర్చుండును.) అయితే రేపే మన రిజిష్టరు వివాహం'

రఘు:—ఓ అలాగే. అయినా మనసులుకలిస్తే చాలదూమధ్య వర్తులెందుకు? ఈ వేళనుంచి నాఇంట్లో నేవుండిపో సుశీలా.

సుశీల:-థాంక్స్. అయితే మీనోటితో నన్నొకసారి హల్లో డార్లింగ్ అనండి.

రఘు:-అలాగే అంటాను. (తటపటాయించి) హల్లో డార్జిలింగ్!

సుశీల:-(పకపకనవ్వి) అదేమిటండి డార్జిలింగ్ అంటారు. అదొక ఊరు పేరు. డార్లింగ్ అనాలి.

రఘు:-ఓహో అవునవును నాకూ తెలుసు అదొక పట్టణమని. నేను చిన్నప్పుడు అక్కడికి వెళ్ళాను కూడాను. ఆ ఊరు నిజంగా ఐస్ క్రీంకన్నా అద్భుతంగా వుందనుకో ఇంతకీనిన్ను దానితో పోల్చానన్న మాట. తెలిసిందా

సుశీల:-(నవ్వి) అలాగా మీరు చమత్కారంగా ఇట్టే మాటలూ మార్చగలరన్నమాట.

రఘు:-అదెంతసేపు మూడు నిమిషాల్లో.

(వరహాలు ప్రవేసించి వాళ్ళుఇద్దరూ సోఫాలో దగ్గరసా కూచోవడం చూసి ఆశ్చర్యపోతాడు)

వర:-అయ్యగారూ హొటేలునుంచి భోజనం ఒచ్చిందండి. సల్లారి పోతాయేమో సప్పునిరండి.

రఘు:-అలాగేరా ఒస్తున్నాం ఒడ్డించమను. (సుశీలవైపుతిరిగి) సుశీలా లే భోజనంచేద్దాం.

సుశీల:-నాకు ఆకల్లేదు మీరువెళ్ళండి.

రఘు:-అలాకాదు రావాలి (సుశీలచెయ్యి పట్టుకుంటాడు)

సుశీల:-సరేపదండి. (ఇద్దరూ లేస్తారు)

(రఘునాధరావు సుశీల తెరలోనికి నడుస్తారు. ఆశ్చర్యంతో వరహాలు వారువెళ్ళినవైపుచూస్తూ అలాగే నిలబడిపోతాడు.)

(తెర పడుతుంది.)

# నాలుగవ రంగము



(సుశీల రఘునాధరావుల వివాహంఅయిన కొన్ని నెలల అనంతరం వారిమనస్తత్వాలు మారతాయి. రఘునాధరావు డబ్బుచాలా ఖర్చవుతుంది. ఒకరోజు సాయంత్రం రఘునాధరావు పడకకుర్చీలో పడుకుని పక్కనే తనకాళ్లు పిసుకుతున్న వరహాలుతో మాట్లాడుతూవుంటాడు.)

రఘు:——ఏరా వరహాలూ, అయితే ఎక్కడికెళ్ళివుంటుం దంటావు?

వర:——ఎవరండి?

రఘు:——ఇంకెవరు మీఅమ్మగారే.

వర:——అదేదో సంఘంటండి అక్కడికెడతాను బండితీసుకు రమ్మని చెప్పారండి ఇందాక.

రఘు:——అదాసంగతి మహిళాసంఘానికి కార్యదర్శి అయ్యారులే మీ అమ్మగారీమధ్య. అక్కడికెళ్లిందనమాట. లక్షసార్లు చెప్పాను ఆట్టే తిరగవద్దని. అది ఆడిందిఆట పాడిందిపాట అవుతోంది.

వర:——నిజమేనండి బాబూ నేనూ చూస్తూనేవున్నానుగదండి అయినా మీరంటే ఆవిడకి బొత్తిగాభయం తగ్గిపోయిందండి మొదట్లోకన్నా. మీరు ఆవిణ్ణి అదుపులో పెడితేగాని......

రఘు :—మొక్కయి వంగనిది మానై వంగుతుందిరా వెర్రి మొహమా!

వర :--బాగా సెలవిచ్చారండి అయినా ఒక్కమాటు అమ్మగారిమీద కోప్పడి చూడండి.

రఘు :-(చాకా చేతులు పైకెగదోస్తూ) చూసుకో వరహాలూ ! ఇవాళ రానీ చెబుతాను దానిపని. మళ్లా గుమ్మం కదలనిస్తే ఒట్టు.

వర :-అలా చెయ్యండి. (పక్కకుచూసి) అదుగో అమ్మగారి లాగే వస్తున్నారండి.

రఘు :-ఆం తప్పుకో నువ్విక్కడినుంచి ముందు. నువ్వు వెళ్లి గేటుదగ్గరుండి ఎవరూ మొగాళ్ళు రాకుండా చూడు. ఒకవేళ వచ్చినా ఇంట్లో మొగాళ్ళు లేరని చెప్పి పంపెయ్యి.

వర :-సరేనండి (తలగోక్కుంటూ వెడతాడు)

(వరహాలు వెళ్ళగానే మరోవైపునుండి సుశీల ప్రవేశిస్తుంది. చేత్తో న్యూస్ పేపరు పట్టుకుని.)

రఘు:-(కోపంగా) సుశీలా ఆగు ఎక్కడినుంచి వస్తున్నావిప్పుడు?

సుశీల :-ఏం అలా అడుగుతారు ?

రఘు :-పనుంది చెప్పు.

సుశీల :-అదంతా మీ కవసరంలేదు.

రఘు : నీ వేషాలు నాదగ్గరసాగవు జాగ్రత్త. నన్ను మోసగించాలని చూస్తున్నావా ?

సుసీల :-ఏమిటండీ ఇవాళ మీరు అలా మాట్లాడతారేం కోపంగా. ఏంచేశానని మీఉద్దేశం.

రఘు :-నువ్వు పరాయి మొగాళ్ళతో మీటింగులకని బయలు దేరి బీచిలికీ, సినీమాలకీ తిరుగుతూన్న సంగతి నాకు తెలీదనుకుంటున్నావా ?

సుశీల :-ఏమండోయ్ నన్ను మీరలా ప్రశ్నలడిగి బాధిస్తే ఒక్క నిమిషం ఉండలేను మీయింట్లో. (చేతిలోని పేపరు క్రింద పారేసి చర చర ఇంట్లోకి వెడుతుంది)

రఘు :-ఆఁ ఏమిటీ ? (సుశీల వెళ్ళినవైపు చూస్తాడు ఆశ్చర్యంతో)

(వెనకనుంచి కాశీనాధ్ సూటు వేసుకుని ప్రవేశిస్తాడు)

కాశీ :-నమస్తే రఘునాధరావుగారూ !

రఘు :-ఎవరది ? కాశీనాధమా !

కాశీ :--అవునండి నేనే, మర్చిపోయారా ? ఏదో గొడవ పడుతున్నట్టున్నారే !

రఘు :-అహాఁ ఏమీలేదు. ఈ మధ్య కనపడ్డం లేదేమోయ్

కాశీ :--ఇంక కనపడనులెండి.

రఘు :--అదేమిటి అలా అంటావు ?

కాశీ :-అంటే నేనకలకత్తా వెళ్ళిపోతున్నానండిఇక్కడనుంచి

రఘు :--అలాగా... నేను నీళ్ళగదికెళ్ళి స్నానంచేసి వస్తాను, కూచో పేపరుచూస్తూ.

కాశీ :--అలాగే వెళ్ళిరండి.

(రఘునాధరావు స్నానానికై నీళ్ళగదికి వెడతాడు. అతడు వెళ్ళగానే సుశీల నవ్వుతూ ప్రవేశిస్తుంది)

కాశీ :--సుశీలా ఇంకా ఆలస్యం చేస్తావేం ? ఆ పెద్దమనిషిని ఇట్టే టోపీలో పడేశావే ! వెరీగుడ్.

సుశీల :—నీకోసమే ఎదురుచూస్తున్నాను. ఇంక మనం స్వేచ్ఛగా ఎగిరిపోవచ్చునా ?

కాశీ :—ఓ యస్. వీధిలో కారు రెడీ. మరి నవ్వు అన్నీ సర్దేశావా నెక్లెస్ వగైరా......

సుశీల :—చప్పున నడవాలి ఆయన మళ్లీ వచ్చేస్తాడు.

కాశీ :—గేటుదగ్గిర జవాన్ వరహాలున్నాడు ఎలాగ ?

సుశీల :—నీవు ముందు వెళ్లి నేరమ్మంటున్నానని చెప్పు వాణ్ణి.

కాశీ :—ఆఁ సరే త్వరగా రా. (వెడతాడు)

(సుశీల ఒక చిన్న సూట్ కేస్ చేత్తో పట్టుకుని సిద్ధంగా వుంటుంది ఇంతలో వరహాలు ప్రవేశిస్తాడు.)

సుశీల :—మూడు వరహాలూ అయ్యగారు పిలుస్తున్నారు.

వర :—ఏరి ఎక్కడండి ?

సుశీల :—నీళ్లగదిలో వున్నారు వెళ్లు. (నవ్వుతూ) డార్లింగ్ !

(వరహాలు వెళ్ళగానే ఇటు అటు చూసి సుశీల పకపక నవ్వుతూ సూట్ కేసు పట్టుకుని వెళ్ళిపోతుంది ఎవరూ చూడకుండా.)

వర :—(ప్రవేసించి తనలో) ఏరీ ఏమైపోయారు !

(వరహాలు గబగబా నడిచి వీధిలోకి వెడతాడు. అతడు వెళ్ళగానే మంచి బట్టలు వేసుకుని రఘునాధరావు ప్రవేసించి కుర్చీలో కూర్చుంటాడు)

రఘు :—(తనలో) పిల్ల దుంపతెగా ఒకడూ కనపడ్డేం. ఏమై పోయారంటాను. (బిగ్గరగా) ఒరేయ్ వరహాలూ !

(వరహాలు ఒగుర్చుతూ ప్రవేసించును)

వర :—అయ్యగారు కొంప మునిగిందండోయ్ (ఏడుస్తాడు.)

రఘు :—(లేచి) ఏమిట్రా ఏమయింది ?

వర :—ఇంకేముందండి అమ్మగారు.........

రఘు :—ఆఁ ఏమిటి ఏంచేసింది ?

వర :—ఇందాక వచ్చిన ఆయనతో కలిసి కారెక్కి వెళ్లి పోయారండి, నేను కళ్లారా చూశానండి.

రఘు :—ఆఁ ఎంతపని జరిగింది (కుర్చీలో కూలబడిపోతాడు.)

వర :—తొందర పడకండి బాబూ. చూడండి గేటుదగ్గర ఏదో కాగితం దొరికిందండి ఇదిగో. (ఒక కాగితం ఇవ్వబోతాడు.)

రఘు:—(తెప్పరిల్లి) ఏదీ చూడనియ్యి. (లేచి ఆశ్చర్యంతో ఆవుత్తరం ఆమూలాగ్రం చదువుతాడు పైకి)

"డార్లింగ్ రఘునాధరావుగారికి—చాలారోజులు మీ ప్రవర్తనసహించాను. స్త్రీపురుషులకు అన్నిటిలోనూ సమానహక్కు లున్నాయని మీకింకా తెలియదు పాపం. నన్ను మీ బానిసగా చేసుకుందామను కున్నారు కాని ఏమీలాభం లేదు. మీ డార్లింగ్ ని ఇంక మరిచిపోండి. నేటినుండి మీకూ నాకూ ఏవిధ మయిన సంబంధమూ లేదు. నేను కలకత్తా వెళ్లిపోతు న్నాను. నాకోసం ప్రయత్నించినా లాభం లేదు. ఇట్లు సుశీల" (ఉత్తరం ముక్కలుచేసి) ఎంతదగా చేసింది!

వర:—నేనుముందరే చెప్పలేదుండి బాబూ జాగర్తని.

రఘు:—ఒరేయ్ వరహాలూ దాన్నిగురించి ఎంతడబ్బు తగ లేశానను కున్నావ్!

వర:—అవునండి. ఇలాగ ఎంతమందిని ఆరివేసిందోనండి మహాతల్లి.

రఘు:—నెక్లెస్ అనీ వల్లకాడనీ మొత్తం పదివేలు దాని మొహాన్ని పెట్టానురా వరహాలూ.

వర:—పోలీసులికి చెబితే ఒస్తువులేనా దొరుకుతాయే మోనండి.

రఘు:—పేపర్లోపడి నలుగురికీ తెలుస్తే మనమర్యాద దక్కుతుందా. పోతేపోయాయిలే వస్తువులు.

వర:—అయితే ఇక్కడింక ఒక్క క్షణంకూడా వుండద్దు పోదాంరండి. పదండి. ఇంకా ఆలోచిస్తారేంబాబూ!

రఘు:—(ఆవేశంతో) నిజమే పోదాంనడు వరహాలూ! నిమిషం ఉండలేనిక్కడ. సామాన్లుసద్దెయ్యి. ఇంటికెళ్లి పచ్చని మనపొలాలు చూచుకుందాం.

వర:—మా ఆడాళ్లు ఎలాగున్నారో బాబూ.

రఘు:—భయంలేదు. ఈ రాత్రిరైలుకే వెళ్లిపోదాంనడు.

వర:—చిత్తం.

(ముందు రఘునాధరావూ వెనక వరహాలూ తెరలోనికి నడిచిపోతారు)

(తెరపడుతుంది.)

సమాప్తి.

"బుద్ధం శరణం గచ్ఛామి"

---

మాస్టర్ మన్ ముద్రాశాల; కాకినాడ.